# శ్రీ దత్తభావ సుధారసము

---

# శ్రీదత్తభావసుధారసము




గ్రంథకర్త.

నాదెళ్ల మేధా దక్షిణామూర్తి

బందరు.



కాపీరైట్] 1955 [వెల రు 0-4-0

[redacted] కేవల కారణశరీర సంబంధియే కాని, తనదెంతమాత్రము [redacted] అవస్థాత్రయము నట్టిదేయనియు రూఢముగాఁ దెలియవలయును. ఎట్లనఁ దాననుదీపము వెలుఁగుచుండు నాటకశాలవంటి యీ స్థూలదేహమునం దాచిదాభాసుఁడే జీవుఁడు, మనసు మంత్రి, బుద్ధి నాయిక, ప్రాణములు సేవకులు, దశేంద్రియములు వాద్యములు, శబ్దాది విషయములే సభాసదులుగాఁ బ్రవేశించి వ్యవహరించినకాలమే జాగ్రదవస్థయు స్వప్నావస్థయునై, నాటకము లేనివేళయే సుషుప్తియగుచున్నది. అప్పుడును దాను సాక్షిగా నుండక మానఁడౌటనే యీయనుభవమును నిద్రలేచినవెనుకఁ జెప్పఁగలుగుచుండును. ఇంద్రియాంతఃకరణసాహాయ్యమున జాగ్రత్తునందును అంతఃకరణమాత్ర సహాయమున స్వప్నమందును నసహాయముగనే సుషుప్తిలోను దాను బ్రకాశించుచు నా యా యవస్థలను గుర్తింపఁగలుగుచున్నాఁడు.

ఇట్లు స్థూల సూక్ష్మ కారణములనెడు శరీరత్రయముకంటెను, జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి యవస్థాత్రయముకంటెను, నన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ యానందమయములనెడు కోశపంచకముకంటెను, జ్ఞానేంద్రియ పంచకము కర్మేంద్రియపంచకము, ప్రాణాదివాయుపంచకము, శబ్దాదివిషయ పంచకము, నంతఃకరణచతుష్టయములనెడు చతుర్వింశతి తత్త్వములకంటెను వేఱై వీనికన్నిటికిని సాక్షిగానున్న బ్రహ్మము నేనేయని 'తత్త్వమ'స్యాది మహావాక్యావబోధమువలనఁ దెలియవలెను. అట్లైన, నాత్మయందవిద్యా నివృత్తియుఁ దత్కార్యసహిత ప్రకృతి నివృత్తియుం దేహపు బ్రకృతిబ్రహ్మసంబంధ నివృత్తియు, నంత జీవేశ్వర భేదభావ నివృత్తియుం దరువాతఁ గర్తృత్వ భోక్తృత్వ బంధ నివృత్తియుం గలిగి, తుదకు దుఃఖనివృత్తియై, క్రమముగాఁ బరమానందరూప బ్రహ్మప్రాప్తి కావలెను. అట్టిదే బ్రహ్మవిద్వరిష్ఠత యనిపించుకొనును. ఇట్లు జీవబ్రహ్మైక్యానుభూతికలుగ నపరోక్షజ్ఞానసాధనముగా శ్రీ శంకర బ్రహ్మను చింతనసంస్థమైన రీతిని 'బ్రహ్మైవాహమస్మి న సంసారీ, ముక్తోహ'మ్మన్న ముక్కలు పెదవులమాత్రమే కాక మనమునకంటవలెను. అట్లౌట యెంతటి మహాసాధకులకో కాని సార్వజనీనము గానేరదు.

కావుననే సర్వలోకతారకముగా 'భక్తిర్నిశ్రేణికా పర'మ్మనిరి. 'భక్తి' యనఁగా బూజ్యులయెడ ననురాగము కలిమి. ఆయనురక్తియన్ననో, 'అంకోలం నిజబీజసంతతి, రయస్కాంతోపలం సూచికా సాధ్వీ నైజవిభుం, లతా క్షితిరుహం, సింధు స్సరిద్వల్లభం ప్రాప్నోతీహ యథా తథా' యని జగద్గురు ప్రబోధితమేయాయె. ఇట్టి 'గౌణీభక్తి' ముం దలవడిన, నదే 'పరాభక్తి'కిం ద్రోవఁజూపి, క్రమముగా స్వస్వరూపానుసంధానమున కిరవయ్యెడిని. అద్దానికొఱకైన, సాకారరూపకల్పన మత్యావశ్యకము కాఁగా నమూర్తిత్రితయమును దత్తదవతారములును వివరింపంబడినయ్యెను. దాన, మతభేదము లుత్పన్నములు

కాకమానదయ్యెను. కాఁబట్టి యైకమత్య సంపాదకముగా నా త్రిమూర్తి స్వరూపమునే యెల్లరుం దెలిసికొని, 'శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవన మర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదన'మ్మన్న చందాన భక్తి నెఱపుటే సర్వశ్రేయోదాయకము.

ఈ త్రిమూర్తి యోగమార్గ ప్రతిష్ఠాపనముఁ గావించి లోకానుగ్రహంబు సేయ ననసూయా గర్భశుక్తి ముక్తాఫలంబై యీధాత్రిం దొలుత నవతరించెను. తచ్చరిత్రము పురాణప్రసిద్ధము. 'భూమివలన సైరణయు గంధవహుని వలన బంధురంబగు పరోపకారంబును......నుదకంబువలన నిత్యశుచిత్వంబును నగ్నివల్ల నిర్మలతయు......వననిధివలన నుత్సాహగోపంబులును, శలభంబువలన శక్త్యనుకూల కర్మాచరణంబును, భృంగంబువలన సారమాత్రగ్రహణ విశేషంబును, స్తంబేరమంబువలనం గాంతావైముఖ్యంబును ......కురరంబువలన మోహపరిత్యాగంబును ......నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబు' నిట్లు 'ప్రవిమల విజ్ఞాననిపుణ భవ్యులుగురువుల్ దవిలిన నిరువదినలువురు నవని విజ్ఞానినైతి'నన్న యనఘాత్ముం డీతండకాదే! ఈతఁడు సత్యానంద చిదాత్మక సాత్త్వికాకారంబుఁ దాల్చి, స్మరణమాత్ర సంతుష్టి వెలయు సర్వకామ ఫలప్రదాతయై, భవబంధ మోచనముఁ గావింప నే సదా దత్తోఽహమస్మి' యని మనల నందఱఁ దరింపంజేయ నిందే గుప్తతం గనియున్న మహాయోగపుంగవుఁడు.

అట్టి శ్రీదత్తాత్రేయమూర్తులను గూర్చి తత్తత్పురాణగ్రథితాంశములను సేకరించి తదనంతరావతార కథాసహితముగా మహారాష్ట్ర భాషలో నొకసరస్వతులు 'శ్రీగురుచరిత్ర'మన విరచించియుండ, నద్దానినే 'సంహితా'ఖ్యముగను శ్రీదత్తపురాణాదికముల నింకెన్నిటినో శ్రీ శ్రీ వాసుదేవానందసరస్వతులు జ్ఞాన కర్మ భక్తి కాండాత్మకములుగా గీర్వాణంబునం బలికి పలికి, సర్వోపాసక మననయోగ్యము గాఁదగునట్లు తచ్చరిత్రాంశస్ఫోరక శతకరూపమున 'శ్రీదత్త భావ సుధారసము'ను గూర్చి ప్రసాదించియున్నారు. అద్దానిని శ్రీకాశీవాసులైయుండిన శ్రీ శ్రీ బ్రహ్మానందసరస్వతులు తాము హృద్గత మొనరించికొని లోకోపకారకముగాఁ బ్రచురపఱచి యుండిరి. వారే నన్నుఁ బ్రోత్సహించి శ్రీగురుసంహితాంధ్రీకరణ రూపమైన 'శ్రీగురుదత్త సరస్వతీయము' రచియింపఁజేసిన వెనుక 1937 లో నిచ్చోటికి విచ్చేసిన తఱి, నీ'సుధారసము'ను నన్నాస్వాదింపఁజేసి, తెలుఁగుపద్యములుగా వ్రాసియిమ్మని కోరుచు, మూలగ్రంథమం దుత్తరార్ధమున శ్రీగురుసంహితా కథాంశము అతిసంగ్రహముగా నుంటచే వానిని సాధ్యమావఱకు విపులీకరింపుమనికూడ నాదేశించిరి. అట్లది యొనర్పంబడి తద్ద్వారమునఁ బదుగురినోళ్లలోఁ బడియుండెను.

ఇప్పు డద్దాని నింకొంద ఱెందఱో తమతమ వాక్కుల కెక్కించికోఁ గుతూహలపడి యడుగుచున్నారు. అట్టి శ్రీగురుదత్తోపాసకులందఱి కూమాడు

వాస్తవ్యులు శ్రీకాళిదాసు శంకరయ్యగారు నాకపరిచితులయ్యు వారల ద్వారమునం దెలిసికొని నాకు వ్రాసిన లేఖయే యిద్దాని నేతాదృశ భక్తాగ్రగణ్యుల కందింపను శ్రీదత్తపురాణాంధ్రీకరణము నింకసాగింపను గూడఁ బ్రోత్సాహకము కానొ టుభయతారకము.

ఉ. చిత్తమునన్సదా నిలిపి, చేతులుమోడిచి మ్రొక్కెదం గృపా
యత్తుల దత్తుల; న్మహిం, నుపాత్త మహాత్మమ విత్తి, నిత్తఱిన్
బత్తి సమస్తతు గ్గోలుపు బాటల, నేటను సూటిఁ గాంచనా
దత్తకథాసుధానుభవ తర్పితచిత్తులఁ నుద్ధరింపఁగన్॥

బందరు
మన్మథమార్గశీర్షము } నాదెళ్ల మేధాదక్షిణామూర్తి



మ॥ సతతంబేనిఁక సంస్మరించెదను యుష్మత్పాద పంకేరుహ
ద్వితయంబుఁ, బాపఖేదముఁ సుఖద, ముద్వేలప్రసాదంబు, మ
న్మతి నుద్భూతముగా వికారములఁ బాపన్వేగ మాదేన, సం
చిత సద్భావమదీయసంగవలయుం జిత్రంపు! దత్తప్రభూ॥ 7

మ॥ మలినంబై తగుచిత్తవృత్తిని శమింపంజేసి, క్షిప్రంబె ని
ర్మల సద్భావముఁ గూర్పఁగా సకలసంపత్కల్పకంబౌ శ్రితా
ర్తులసద్బంధుని, సర్వశోధనసమర్థు, న్సంగహీనుం గృపా
జలరాశిన్మది నత్రిపుత్త్రకు నజస్రంబేను ధ్యానించెదన్! 8

చ॥ సముదితసద్యశః ప్రథిత సర్వదిగంతరుఁడౌచు, నెల్లభూ
తములను లోపలన్ బయటఁ దానగు నిర్జితభక్తకాలుఁడు
త్తముఁడనఘాత్ములందెనఁడు మహామహుఁడత్రిపుత్త్రుఁడో
రిమి మెయి నెల్లకాలము ధరిత్రిసదా కిఁక మాపు దిక్కగున్॥ 9

శా॥ ఈధాత్రీస్థలి కల్లఁ గర్తయయి, యిట్లీమాత్రముం గానిమై
నేదో వేసముఁ దాల్చుచున్న మనుఁగుగా సందేహరింపంగనౌ
నాధివ్యాధిభయార్తిరిక్తులఁ బాయంజేయ భక్తాళి యా
రాధింపన్ స్వపశౌరపార్త యఘు మన్ రక్షింప దక్షుండహో॥ 10

కం॥ భావికగతుఁడౌకొనక యియ్యావిశ్వపమంచె విష్ణువనసూయకల
న్భావింపఁగనా కల్పంబా వేధ కనాదు గోసము, లన్యులకౌనే? 11

ఉ॥ ఏ మహిమాభిరాముని యహీన నవీన లసత్కటాక్ష పీ
యూషామృత సేచనంబున నిహానఁబరానను దాపమాఱి, యొం
త్తో ముదమారఁగాఁ గలుగునో గతిగల్గునొ యట్టి యా పరం
ధాముఁడు మస్మనో వికచతామరసంబున ధామమొందెడున్ 12

ఉ॥ బాధలెడల్చి సత్త్వమెపఁ బాదుకొనం బొనరింప మస్మనో
వీథిని సంచరింపఁదగు వీరదిగంబర దివ్యమూర్తి! యా
వేధ లిఖించె నానుదుటఁ బీడలకీడుచు పాడువ్రాఁత, ని
ర్బాధక మద్దిసేయఁగ శుభప్రతిపాది! విధాత! నీకగున్॥ 13

ఉ॥ శ్రీరమణీయ భవ్యశుభచిహ్నితమూర్తివి, సర్వసంపద
ధారక దివ్యకీర్తివి, నితాంతచతుర్గళ లోకపాలనా
ధార కలాప్రపూర్తివి కృతార్థతగల్గదె? దత్తమూర్తి! యిం
పారఁగ నీకృపారసము నాపైన మాత్రన కానిదేదిలన్? 14

కం॥ మామోహపుఁ జెంజీఁకటి । ప్రామిస్మిఁ గాలిగోటి రత్నద్యుతియే
యేమే లెది యేటికి? జ్ఞానామృతదివ్యప్రకాశ! యతిలోకేశా!

కం॥ భావత్కకటాక్షేక్షణ । మావంతకృపారసాగ్రమై ప్రసరింపం
గావించును సుధన్యుఁగ । దావిష్టకూటసంగసత్వాంతఁగఁ దుర్॥

కం॥ హీనుఁడ నఘమాఘముఁడను । నే నేడనొ! దేవదేవ! నీ వేడనొకో!
మైనస్థపచా వేశా । మానోన్నతి నేకటాక్షమొదవించుఁగదా॥ 17

కం॥ నేనిన్నియంచుఁ జెప్పఁగ । లేనన్నిటిమున్న ఘాంవలిం జేయంగా
నైనను మీకృపనల్లను । గానసవిత్రుండ? శంకకలదే యింకన్?

ఉ॥ నీవు స్వలీలంగన పునీతులఁ జేయుచు లోకులెల్లరం
గావున నీచరిత్రవినఁగా ననకాలము నాకుఁ గూర్పుమో
దేవర! దానదీనయదృష్టి మొసంగఁగ నెంతయేనియుం
బావనతంగనంగలుగు భాగ్యముఁగందును దత్తసత్ప్రభూ! 19

ఉ॥ నీదరి నున్నమున్నటుల నేనువదింపక తప్పు, దెవ్వఁడే
నాదునుసుమ్ము పాపనిలయుండను సందియమింత లేదికన్
నా దురితౌఘమెన్నుటయనంగఁ బ్రభూ! విను, పాంసురేణువ
ర్షోదిత బిందుజాలముల నొక్కటి రెండని లెక్కవెట్టుటా॥ 20

కం॥ నాకంటెఁ బాపకర్ముఁడు । నీకంటెఁ గృపాప్రపూర్తి నేఁగాననటన్
నీకరుణాపాత్రతఁగస । లోకమ్మున నేనుగాక లొచ్చవునెవఁడేన్

కం॥ మీమదియేకృపకలదేన్ । మామక దశకాంచితనంత మానునె
కరఁగన్
గామిని నాదురదృష్టం । బేమని మీముందుపలుక నేర్పదు నింకన్

కం॥ నీవల్లనె మాపోషణ । కావలెననునట్టి బిడ్డకసుఁగందులమే
మీ వేమెల్లనతంత్రిని। కావే! గురుదత్తమూర్తి! కరుణాపూర్తీ

కం॥ నీబిడ్డఁడ నేఁగాఁగా। మాబాబవు, తల్లినీవ, మహిలోఁగావా?
నీబంధునకరుణామృత।మూబూతిగఁద్రావదేవ! యతివయమీవా?

కం॥ దత్తా! కర్త! యభిన్నని। నిత్తో పాదానతాప్తి మీసూనుఁడ నే
సత్తౌదు జగద్యోనీ । చిత్తేజము నెఱయ నేఁజెల్లెనెనీకుఁ? 25

శా॥ ఓ విశ్వాత్మక! విశ్వసాక్షి! సకలసర్వోర్వీజనానీక! నా
నీవేకాఁకిఁక దిక్కు లేదెవరు తండ్రి! బిడ్డ నేఁగానె? నే
నేవేనజ్ఞతఁ జేయు తప్పులను నీకెంచంగ న్యాయ్యంబె? స
ద్భావంబొప్ప నుపేక్ష సేయ కెటులేన్పాలింపు మాలింపుమీ॥

చ॥ తెలియమిచేతఁ గొంతయు విధిన్విహితంబగుకీర్తిసల్ప దు
ష్ఫలన మెఱింతయుం దెఱచుపాపిష్ఠములౌఁ బొనపాట్లు సత్కృపా
జలనిధి! చూచిచూడనటుసైఁచి నను న్మననిచ్చుచుండఁగా
వలయును, గామినేనెటువంగల నేవిల నో మహాప్రభూ! 27

ఉ॥ ఈ తెఱఁగైన తప్పుల ననేకము లేనొనరించుచుంట నీ
చేతముకుందునే యనుము, చీఁదఱనొందుచు మోఁదనందమే?
భూతలమందు బిడ్డచనవుంగొని కాలను దన్నుఁగాక, యే
మాత మనంబునం గినిసి మానునొ తానిల నాదరించుటల్! 28

చ॥ తన తొడమీఁదనుండి సతతంబును నేడ్చుచుఁగాళ్లఁదన్నుచుం
డ నగు నభాగ్యునేన్నుతు ననావిగణంబునఁగూలఁద్రోయునే?
జనని ప్రపంచమందెటను, జల్లనిమాటల బుజ్జగించుటో
యనునయమార్గమన్య మెదొ యాగయుటో కద చేయఁజూచెదుఁ

శా॥ ఏమో లెమ్మని యిట్టిదుర్బలుఁడ నేనెంతెంత చింతించినన్
స్వామీ! నాదెసదృష్టియే పఱచియాశ్వాసింపఁగానెంచవేఁ
శ్రామముల్ చెందుచు డిందుచుందుఁగద నిర్భాగ్యుండనై ముందు ది
క్కౌ యెక్కాఁ? మఱినీవుదక్క గతి యన్యంబేది ? దత్తప్రభూ॥

మ॥ పసిపాపంబొకొ! మోసకాఁడితఁ డిటుల్ స్వార్థప్రియత్వంబునన్
గుసిలించు న్మసలంగ నీఁడనుచు నీవుందోఁచునో యేమొ, కా
దుసుమీ! యాఁకొన 'నమ్మ'యేనపుగ కెందుం బెట్టఁగా' విందు మే?
విసుపుం జెంద కమందవత్సా కృపనిటు లీక్షించి రక్షింపుమా॥

మ॥ తలి కోపించినఁ దండ్రి గానవమునంద న్వీలగున్ దండ్రి కూఁ
కలు వేయంగను దల్లి బుజ్జనములోఁ గంబంబె వేటన్గందు మే!
తలియుం దండ్రియు నొక్కఁ డీవయగుచున్ దండింపనాకండయి
య్యాలలో లేదిఁకవద్దు నిర్దయత స్వామీ! దత్త! భక్తావనా॥

మ॥ ధర నేగెన్వరు నమ్మి నిన్గొలిచి రేతద్భక్త లోకాగ్రవ్యు లె
ల్లరిలన్ దారుకృతార్థతంబడయు లీలం గాంచి యస్మద్విధం
తరమందుం బరికించి నీవలన నుద్ధారంబు సిద్ధింపనే
శరణంటిన్ గురుదత్తమూర్తి! కరుణాసారంబు వర్షింపవే॥ 33

మ॥ ఎపుడున్నీపద పంకజాతములయందే శ్రద్ధ నీయంబె తో
రపుటాసక్తి యొసంగు భక్తుల కనర్థంబుల్ నివారించి, ని
క్కపు సౌఖ్యంబు ఘటింపఁజేయుదనుచు న్గాన్పింపశాస్త్రంబులం
దిపుడే నిన్శరణంటి, దత్త! నను రక్షింపంగ వే రాఁగదే॥ 34

మ॥ భగవంతుండగు భక్తవత్సలుని గొల్వంగొల్వ నేనాఁటికేన్
సుగముంగూర్చియనుగ్రహింపఁజేయటంచున్న మ్మిప్రాణమ్ములన్
బిగియంబట్టుచు నెట్టుచున్ దినములుర్వి న్నిన్నె ధ్యానించుచుం
డుఁగదా దత్త! మహానుభావ ననుభక్తుం బ్రోవవే యిప్పుడేన్॥

మ॥ వినుమీ, నీపదభక్తితో మెలఁగుదు న్విశ్వంభరామండలం
బున నాదంచిఁక నేది లేదరయ, నెప్డున్నీ కధీనుండ, న
ర్పణమా నీతనువు న్మనోధనము సర్వంబిప్డ నీ, కో జనా
ర్దనమూర్తీ! కృపదత్తమూర్తి! యిఁకమీఁద న్నాపయిం
గొల్పుమా॥ 36

మ॥ ఎఱుఁగన్నీ యెడ బత్తిసేయుటెటులో యేరీతి నర్చించుటో
మఱి యేదానములైనఁ జేయుటో స్వధర్మంబైన నేమాత్రమేన్

నెఱపంబూచునా! పద్యముల్గొనకటే నే నేర్చితిం గూర్చితిం
గరుణ న్నీవని జిత్తగించుచుఁ గటాక్షంబు న్బ్రసాదింపుమీ॥ 37

చ॥ విధివిహితంబుగాఁ దొలుత వేదము నధ్యయనంబొనర్పలే
దధికతరప్రయాసమున గాదట నోరిచి బ్రహ్మచర్య సం
పదఁ బొదలించికోనయితిఁ బైన నిదిప్పు గృహస్థధర్మమే
నధమము తిన్నఁగా ననువదయ్యాను జెప్పితిఁ దప్పు సైఁపుమీ॥

కం॥ లేదయ్యా సత్సంగతి। లేదెయ్యెడ విబుధసేవ లేదిఁక ధర్మ
కాదృతిమైననుదత్తా! నీదయయే యూఁదరువని నిన్నగణింతిన్॥ 39

కం॥ ఒప్పెఱుఁగుదుఁ దప్పెఱుఁగుదు। నొప్పొప్పదుబుద్ధి, తప్పునోరనె
చనుఁదా
నెప్పుడు మదిఁ దగు దత్తా! యెప్పనికిం బురికొలుపుదొ
గనే నదానరుఁడే॥ 40

ఉ॥ తాపసలోకసంస్తుపదా! సుసత్త! సదాధరిత్రినా
కేపనిచేసిన న్వలెఁ దెఱ్యెంతొఁ గొల్చిన నేడకేగ ని
చ్ఛాపరిపద్గనంబునను సంతతచింతను సంస్తుతిన్ మనో
వ్యాపృతినైన నస్వాధి భవద్విషయైకవిహారి యబ్బుతన్॥ 41

మ॥ విను నశాంతిమున్ గొల్పువారలను శాంతింగూర్పఁగాఁ జూడను
న్నను దద్భక్తులు దిక్కు-కానకిలలో నాశంబునేకాంత్రునా
ననుమానంబాకో! దత్తమూర్తి! వినుమయ్యా నెమ్మదిన్నన్నుఁ గూ
ర్చిన యాలోచనమున్న నే యుఁనను నాజీవంబులే న్నిల్చెమున్॥

ఉ॥ వచ్చియురాని మాటలను బల్కెదనేవిగొ! నాలిలోన నే
పొచ్చము లేమినెంచి యెటఁబొల్లులు గల్గిన వానినెల్లఁ బో
నిచ్చుచు నన్ను బిడ్డని నభీప్సితమారఁగఁ బ్రోవవేని నా
కెచ్చటనేని దిక్కు-గలదే? వలదే యిలఁదేర్చు టెమ్మెయిన్॥

మ॥ అతిలోకప్రతిభావిశేషుఁడవు నిన్నర్గించి దాసం బ్రస
న్నతనందించికొన న్సమర్థుఁడనె? మందప్రజ్ఞుఁడన్నేను వా

మ॥ నికృతారిష్టము కృష్ణలోని 'కురుగండి'కిన్ బైనఁదానుండి యం
బికకున్ సాంబుఁ బ్రదోషపూజ సలుపన్ విష్ణుండగున్
సూనుఁడం
చోక గాధం దెలిపెన్ సుపుత్త్రిని మనీషోపేతుఁ గావించె వా
రికిఁ బ్రాణంబుల నిల్పె నెవ్వఁడలయాత్త్రేయుండ దిక్కయ్యెడున్॥

మ॥ నిజసేవాపరతంత్రుఁడై మెలఁగనా నిర్ణేజకుండౌ కన్ మ్లే
చ్ఛ జనాధీశుని వైభవంబుఁ గని యాశ్చర్యంబె దంగాంచనే
సుజనారాధ్యుఁడెవండు వాని యవనేశుం జేసి తానజ్ఞదృ
ష్టిఁ జరింపం జనకుండునో కురుపురిన్, సేవింతు నాదత్తునే॥

మ॥ గురులంగొల్వఁగ సంపదల్పొదల మ్రొక్కుల్దీర్పఁగావల్లభుం
డరుగన్ ఘాతుకులంటివాని వధ సేయన్ వ్యాలిగా వ్రాలి మ
స్కరులెవ్వారలతస్కరాళిఁ బొలియంగాఁ జేసి జీవింపఁ జే
సిరో భక్తద్విజు, నామహామహుల నే సేవింతు దత్తేశులన్॥

ఉ॥ శ్రీపదబోధ మంబవిని చేయఁ బ్రదోషశివార్చనంగరం
జాపురిఁ దత్సుతుండపుడు జన్మమునంది నృసింహనాముఁడై
చూపినలోహమెల్లఁ గనఁ జోద్యముగాఁ గఁ బసిండిఁ జేసెనో
యేపరమాత్ముఁడా మహితుఁ డేలెడు దత్తుఁడు దత్తచిత్తుఁడై॥

మ॥ ఇలసేతం దుదయించు లే మొదలుగా నేనాఁడు నోరెత్తమిం
బలుకే బంగరుగా ద్విజత్వమొదవ న్వాక్సిద్ధిమై యాగమం
బులనెల్లం దనయంతనే పలుకుచు న్బోధించె వేదాన్త వా
క్కుల నాయంబకతండె దిక్కనుచు మ్రొక్కుల్ ప్రొక్కుదున్
దత్తునిన్॥ 67

చ॥ కవ లనుజన్ములేర్పడఁగఁ గైకొని తల్లి యనుజ్ఞ కాశికే
గి, విగతకల్మషుండెవఁడు కృష్ణ సరస్వతులీఁ గ్రమంబు, వే
దవిహితరీతి సన్న్యసన ధర్మమునంతట నాశ్రయించి యా
శ్రవులకు మోక్షమార్గము నొసంగె నతండలదత్తుఁడేలెడున్॥

చ॥ సకలమహీప్రదక్షిణమిషంబునఁ దీర్థములెల్ల మెట్టి ఘా
త్రకలితుఁడై కరంజనగరంబున నంబకుమ్రొక్కి తన్వి, నా
శికనాకశీలా రోగికి విశేషముగానిడి భక్ష్య భోజ్యముల్
సుకృతిహతార్తియై నెగడు స్తుత్యుఁదలంతునుదత్తమూర్తినే॥

కం॥ సాయందేవువధింపఁగ। నేయవనపుఁడెంచెనతనినిమ్మెడఁదన్నెడఁదన్
భీయుంగూర్చిమరల్చెనో। చేయూఁతగొసంగునాకుశ్రీగురుఁడతఁడే॥

మ॥ అమలోదాత్త సమస్త తీర్థమయుఁడేయాఁగాక తానల్ల క్షే
త్రమహత్త్వంబొగి నుగ్గడించి తన ఛాత్రశ్రేణి నెల్లన్ నిజా
శ్రమధర్మంబుల వీడకుండ విలసంచారంబుఁగావింపఁ బం
పె, మహాభాగుఁడతండొ తద్గురుని సేవింపంగ నన్బ్రోవఁడే?॥

మ॥ వగవైద్యేశ్వర సన్నిధానమున గుప్తప్రక్రియన్నిద్దుతో
జరుపన్స్వాత్మసరక్షాలమొక్కఁడుఁగుశిష్యత్వానుపాత్రోపల
బ్ధి రిరక్షుంగనుమన్న, సిద్ధిగురుభక్తింగొల్వ నేయంచు ది
ద్దిరహింగూర్చిరొ తద్గురూత్తముల యర్థింగొల్చు నన్నేలరే?॥

ఉ॥ అందఱు విందవందురునొకారుఁడు పండితపుత్త్రుఁడైన ధీ
మంతుఁడు జిహ్వ కాళికి సమర్పణముంబొనరించి శీర్షమీ
యం దఱియంగవాని నుమ యాఁపిన మస్తకమందు హస్తముం
పందళితాజ్ఞతాప్తిఁ బ్రతిపత్తిని గూర్చెనొ కొల్తుఁ దద్గురున్॥ 73

చ॥ తిరిపెమె జీవనంబయినఁ దృప్తమనస్కుఁడుఁ గర్మనిష్ఠుఁడై
దొరకమి వాకిటం బెరుఁగు దొగ్గలికూరమె మెక్కుచుండు భూ
సురుఁడిదు శాకభిక్షఁగొనుచున్నధివానికిఁ గూర్చిపోవు సా
దరునమరేశ్వర స్థితుని దత్తగురూత్తము నాశ్రయించెదన్॥

సీ॥ నరసింహ నఖతాపహార ఫలాకీర్ణ మ
హోదుంబరచ్ఛాయ నాశ్రయించి
ఘనచతుష్షష్టి యోగినుల సేవలఁగొనన్
గఱిగానుజుఁడు చేల కాపరికని

మహిని వారాణాసీమహిమంబు నరయంగఁ
గరుణించి నిజపాదుకలఁ గొనుమని
క్షణమునఁ ద్రిస్థలీగమనంబలవరించి
మరలించి సంగమమహిమఁ దెలిపి
తే॥ తా నుదుంబరమున గుప్తతంగనుటను
భక్తకల్పద్రుమంబుగాఁబరఁగఁ జేసి
సుగురుఁడేతఁడు గంధర్వ నగరమందుఁ
జేరెనాదత్తనరహరి సేవ్యుఁడెందు॥ 75

మ॥ తన ద్రవ్యంబు హరించు బ్రాహ్మణిని భూతంబాచు బాధించువి
ప్రుని పేర్తత్వమునొర్ధ్వ దైహికములా ప్రోయాలిఁగావింపఁ జే
య వశింపంబొనరించి పుత్త్రపరదుండమ్యో స్నతీభక్తి భా
వనమొంగంగ నుదుంబరాశ్చనమునన్ బ్రార్థింతుఁ దచ్ఛ్రీపదున్॥

మ॥ వరలబ్ధాత్మజుఁడయ్యు బాల్యమునఁ బోనన్మాతయత్యార్తిచే
వరదాతన్నిరసింపఁ దాసనకుమైవచ్చెంబ్రబోధింపఁగాఁ
బరమార్థంబబలా మనోగ్రసథిను సంభావ్యంబుగా నేయుమం
బరవాసుండలబిడ్డకిచ్చె నసువుల్, వర్ణింతుఁదచ్ఛ్రీగురున్॥ 77

మ॥ వరభీమామరజాఖ్యసంగమ సమీపస్థంబుగంధర్వ స
త్పురమందొక్కెడ గొడ్డుగేదెఁబిదుకన్ దుగ్ధంబు బిక్షార్థమి
య రచించెన్ మఱితద్గృహంబునను సర్వార్థంబులంగూర్చి సం
బరమొప్పించెనెవండుతద్గురుఁడిలన్ వంద్యుండుమాకెయ్యెడన్॥

మ॥ నరపాలార్థితుఁ డేమహామహుఁడు యానారూఢుఁడై గాణగా
పురమందొక్క మఠంబుఁ జేసుతఱి తావున్వాడనశ్వత్థ సు
స్థిరుఁడై యుండిన బమ్మరక్కసుఁ గృతార్థీభూతుఁగావించె నా
నరసింహాకృతిదత్తమూర్తి నిరతానందప్రదుండయ్యెడున్॥ 79

మ॥ కుమసీవాసిఁ ద్రివిక్రమున్ నృహరిభక్తున్ దూషితాత్మీయ చ
ర్య, మదుంగంబొనరింపనేఁడు శిబికారూఢుండుగానేగి, భ్రాం

తమనస్కుఁడుగ విశ్వరూపమును సంధానంబుఁగావించి మిం
చె, మహోత్సాహుఁడు దత్తమూర్తి యతనిన్ సేవింతు నుద్య
త్ప్రభున్॥ 80

మ॥ కుమతిన్ మ్లేచ్ఛునిఁ జేరి మెచ్చుకొనవాక్ఛూరత్వమేపార, వా
దమొనర్పంజను దుర్విదగ్ధులను విద్వద్వేషులందాఁ ద్రివి
క్రముఁడే సద్గురుఁ జేర్ప వారలకనర్థప్రాప్తి యౌసుండు గ
ర్వమువీడుండని నేర్పఁజూచెనతనిన్ ప్రార్థింతునశ్రాంతమున్॥

శా॥ తానేతండల గర్వధూర్వహులకుద్యద్వైదుషిన్ వేదశా
ఖానేకంబుల నుగ్గడించినను దుర్వ్యాపారమున్మానమిన్
హీనుండొక్కని భస్మలేపనమునన్ వేదార్థవేత్తృత్వసం
ధానంబొప్పఁగఁజేసిమాన్పె నతనిన్ ధ్యానింతుదత్తప్రభున్॥

మ॥ కృతవేత్తృప్రతిపాదితార్థములలోఁ గృత్స్నంబుగాలోక దు
ష్కృతులం గర్మవిపాకముంచెలిపి నిశ్శ్రీకంబుగాఁగా ద్రుటిన్
జ్యుతవేత్తృత్వమపాత్రభస్మత మహాంహోరాశి కల్పించెనో
యెతఁడాతండలదత్తసద్గురుఁడె నాకెందున్శరణ్యుండిలన్॥ 83

మ॥ ఒకరాకాసికి వామదేవకృత భస్మోత్కర్షబోధమ్ము పా
తకముల్వీడఁగఁ జేయ దానెకృతార్థత్వంబిలంగాంచుటల్
ప్రకటప్రక్రియగాఁ ద్రివిక్రమున కెవ్వండాప్తతం దెల్పె న
య్యకలంకోత్తమదత్తసద్గురుశరణ్యత్వంబిఁకన్ గణ్యమౌన్॥

శా॥ గోపీనాథసమాఖ్య విప్రసుతుఁడొక్కండొక్కటన్ రుగ్ణుఁడా
నాపన్నస్థితిఁ గొంచుఁ దత్సతియుడాయన్ రా నతండీల్గుటన్
బ్రాపెవ్వండయి యోగిరూపమునఁ బ్రోవన్వచ్చె వేదాంతవి
ద్యాపూర్ణుండతఁడే శరణ్యుఁడెట దత్తాత్రేయుఁడీధాత్రిలోన్॥

మ॥ దివినంటంజను వింధ్యవంచుటకునై దేవేంద్రుఁడా కుంభ సం
భవుదర్శించుతఱిన్ బృహస్పతియె లోపాముద్రఁదానెంచుచున్
యువతీధర్మములిట్లు పల్కెననియే యోగీంద్రవేషుండు సె
ప్పె విదగ్ధుండల దత్తసద్గురుని సేవింతు న్శరణ్యోత్తమున్॥ 86

మ॥ మొదటన్ శ్రేష్ఠుఁడటంచు భర్త్రనుగమంబుంబల్కి సావిత్రికిన్
విధవాధర్మములుగ్గడించి కృపతోఁ బ్రీక్షించి రుద్రాక్ష భ
స్మదుఁడౌచు న్నిజపాద్యసేకమునఁ దత్స్వామిన్ గతప్రాణునిన్
బ్రదికింపంగ నె రక్షకుండతఁడె ప్రోవంగొల్తు నా సద్గురున్॥ 87

సీ॥ గుణరూపములకిక్క గణికయొక్క తెమించె
నిజనిర్మిత నిత్యనృత్యగరిమఁ
దన్నాట్యమంటపాంతర్వర్తి కుక్కుట
మర్కటాల్ రుద్రాక్షమండితములు
గారత్నలింగంబు కరమందు నింపొంద
భస్మలిప్తాంగుండు వచ్చెనటకు
వచ్చిన యాశివవ్రతి నదివరియింప
నదియు శివవ్రతియాట యరయ॥

తే॥ మంటపముఁజొచ్చి తానందు మగ్గెనదియు
మ్రిందియందున్న కుక్కుటమర్కటములె
యక్షకారణ నృపసూనులైగటనుచుఁ
దెలుపు గురుమూర్తికిద్దె యంజలి ఘటింతు॥ 88

మ॥ మృతులౌద్వాదశహాయనుల్ బ్రతుకఁగాశ్మీరాధిరాడ్భద్రసే
న తనూజాతులకు స్వరాశరులు దేనక గూర్చిరో ప్రాణమా
శతరుద్రీయమహత్త్వముందెలిపె దృష్టాంతంబుతో నేఁడు త
న్నుతచారిత్రుని భక్తవత్సలు శరణ్యుండంచు ధ్యానించెదక॥

సీ॥ సంజీవనీమంత్రసారంబుఁగోల్పోవమె
దేవయానికి నేర్పదితిజగురుఁడు
కానఁగూడదు చెప్పఁగా మంతు లింతుల
కిశులసేవయే యిష్టదమని
పలుక మైత్రేయి సౌభాగ్యప్రదముగాఁగఁ
జిత్రవర్మ కుమారిచేసె వినుము
సీమంతినీదేవి సోమవారవ్రతా
చరణంబె మృతభర్తఁ మరలిచెనని

తే॥ యెవఁడు సావిత్రికిన్ లోకహితముగాఁగ
నల్లచందా్రంగద చరిత్రమెల్లఁబలికె
నానృసింహ సరస్వతీయతివరేణ్యుఁ
డా శరణ్యుఁడు మాకు నయ్యత్రిజుఁడు॥ 90

మ॥ ఒకవిప్రుండు పరాన్నమొల్లమిని బత్యుత్కంఠఁదీర్పించి యా
హ్నికకర్మాళి గృహస్థధర్మము లెఱింగించెన్ ద్విజపత్న్యా
యకరవ్యాపృతులార్ప ముక్తిపదమందాసక్తియుం గొల్పనే
యకలంకుండల దత్తసద్గురు శరణ్యత్వంబగణ్యంబిలన్। 91

కం॥ సోలెడు బియ్యమెవండిన।జాలనదే నాల్గువేలు జనముల్
దనుపన్
లీలనెవండగపఱచెనో।యేలున్గురుదత్త సిద్ధుఁడిల మమ్మతఁడే॥ 92

కం॥ ఏవాఁడశ్వత్థమహా।త్త్వావిష్కృతి కనఁగవంధ్యయానిష్కళఁబు
త్త్రావిర్భవమందించెనో।యావరదుఁడె దత్తమూర్తియా
మమ్మోమన్॥ 93

సీ॥ భవపూజనముచితాభస్మంబుతోఁ జేయ
శబరునకు క్షమా సరణిఁబట్టి
తనయింటెనిల్లాలి దగ్ధంబుఁగావించి
భస్మార్పణమొనర్ప భవుఁడు ప్రోచెఁ
గుష్ఠద్విజుఁడు శుష్కకాష్ఠంబు చిగిరించు
దనుక నశ్వత్థసేవను బొనర్ప
నేఁజెప్పుచొప్పునఁదాఁ జేయుటనుసిద్ధి
కాంచఁడే చూడుఁడీయంచుఁబలికి॥

తే॥ నిజకమండలూదకమున నిమిషమునను
కట్టెచిగిరించి యంతలోఁజెట్టుగాఁగఁ
జేసి కష్టమువాపి రక్షించెనెవ్వఁ
డట్టి గురుమూర్తినేయింక నాశ్రయింతు॥ 94

సీ॥ నామధారకవంశనాథ సాయందేవుఁ
డోరిమితోఁ గొల్చుచుండుతఱిని
నడిరేయిజడివడి తడిసినయెడనగ్గి
కరిగిత్రోవనుదప్పి తిరిగిరాఁగ
మును త్వష్టగురుసేవ మానుకువఁజేయంగ
గృహనిర్మితియతండు గృహిణికిత్రైక
బుడుతండు పాదుకల్ పుత్రికముద్దులున్
దంతపుబొమరింటఁ దనరుపుమన
తే॥ వల్లెయని మాటదక్కఁడి వడువెదియని
కడుఁదపింప మహాత్ముఁడు కాశిఁజేర్చి
విశ్వకర్మునిఁగాఁజేయు విధమెవంచు
తెలిపెనాదత్తగురున కంజలిఘటింతు॥ 95

శా॥ ఆందందెవ్వీధి వారణాసినగునో యాత్రాక్రమంబద్ది చె
ప్పందదృశ్యములెల్లఁ గాంచ నెదుటన్ భాసింపఁగాఁజేయ సా
యందేవున్సకుటుంబ మాప్తతనుడాయంజేయ నేగేయుఁడొం
చెందద్భక్తశరణ్యసద్గురు వరున్సేవింతు నశ్రాంతమున్॥ 96

సీ॥ దీక్షశీలాగని దివికేగఁ గర్కశ
నింతిగాఁగొనియె సుమంతుఁడంతఁ
గౌండిణ్యునకు శీలకాంతయాచు ననంతుఁ
బూజించిసంపదల్ పొదలనెసఁగఁ
దద్భర్తతోరంబు తగులఁబెట్టుటసిరుల్
కరిమ్రింగిన వెలఁగ కరణిఁగాఁగ
నయ్యనంతుండెడనని రోయనత్యార్థఁ
గౌండిణ్యుఁడెటు తన్నుఁగనఁ గలిగెనొ॥
తే॥ తెలిపికృష్ణుఁడు ధర్మజుఁదేర్చెననుచుఁ
జెప్పియయ్యనంతాఖ్యుఁ బూజింపఁజేసి
కొనుచు నెవఁడు సాయందేవుఁగూర్చె సిరుల
నట్టి శ్రీదత్తగురుఁడె నాకాదరువగు॥ 97

వ॥ అనుకొనినంతఁ దంతుకు మహాశివరాత్రిని శ్రీగిరీంద్ర యా
త్రనుబోనరింపయోగగతిఁ దాఁగొనిపోయి కుముద్వతీ విమ
ర్షణు లెటు తొల్లిపావునము శ్వానమునై, కృతతత్ప్రదక్షిణా
ప్తిని నృపులైరొ తచ్చరితఁ జెల్పెడు శ్రీగురునాశ్రయించెదన్॥

శా॥ కాళీచండలలంబురశ్చరణముంగావించు నందయ్యకాం
దోళింపన్స్వప్నదినే నృసింహ గుహపానుల్ మొక్కనౌ దిక్కునాన్
వైళంబే తనిఁ జేఁ గుష్ఠమును బాపన్ దృష్టిమాత్రాన, సం
బాళింపంగవిఁ జేయఁగల్గె నతనిన్ బ్రార్థింతు దత్తప్రభున్। 99

మ॥ కవితాకేసరియౌ నృకేసరి సదా కిల్లేను సేకొల్తు నిం
కెవనిన్ గేయునిఁగాఁ దలంపననికో నేతింతుతత్స్వప్నమం
దవగీర్ణుండయినట్లు తోఁచి తఱియన్ వ్యాసకృతిం జేసి పా
దవనేజ భ్రమరంబొనర్చికొనె నాదత్తప్రభుం జేరుమన్॥ 100

మ॥ ఒకదీపావళి సష్టరూపములతో నూహాగ భక్తాళి కా
నికలర్పింప సపర్యల స్నతుల నండె స్వర్గసంతుష్టికే
యకలంకోత్తమ యోగిసత్తముఁడు దత్తాత్రేయుఁడే తానవై
న కృపాపూర్తి నృసింహమూర్తి యతినిన్ ధ్యానింతు
సిష్టాప్తికై॥ 101

మ॥ తనవాఁకిల్లరుఁగాంచినారలును నింపల్పేసిన న్మూర్ఖ భ
క్తిని శూద్రుండు కృషీవలుండల గుహాకీన్ జొన్న చేనెల్లఁ బం
డనినాఁడే తెగఁగోయ మిక్కుటపుఁ బంటన్వేఁగఁ బండింపఁ జే
సెనెవండా నరసింహమూర్తిని నమస్తేయంచు పాసించెదన్॥ 102

సీ॥ జాలంధరహత నిర్జరులకై శివుఁడిచ్చు
నమృతమందలి శేషమమరజయని
సంగమేశ్వరుఁడౌ గోస్వామి ప్రార్థనమున
విశ్వేశుఁడై యట్లు వెలసెననుచు
మార్జార హతిఁగుష్ఠమయగాత్ర రత్నాంబ
క్లేశమడఁచు పాపనాశమిదని

కోటితీర్థంబిదిగో గయాతుల్యంబు
కల్లేశుఁడిత్రఁడె మోక్షప్రదుఁడని
తే॥ త్రిస్థలీమహిమంబష్టతీర్థగరిమ
నచ్చోటనేకద్దు సుండని యందఱకును
జాటు నేమేటియాతని దీటుఁగనము
దిక్కతఁడె దత్తగురుమూర్తి మ్రొక్కుదుని దె॥ 103
సీ॥ శ్రీపాదభక్తు నిర్ణేజకుండై మ్లేచ్ఛ
భూపతి వైదూర్యపురము నేల
నతనిస్ఫోటార్తిక నాశ్రితవిప్రులు
సాధుదృష్టియుడంచు సరణిఁదెలుప
వజ్రబాహుతనూజు వ్రణదిగ్ధదేహుని
ఋషభయోగీశ్వరుదృష్టిమున్ను
ప్రాగ్జన్మసుకృతాప్తిభద్రాయువుం జేసె
నన 'గాణగాపురి' కరుగ నృపతి
తే॥ యెవనిచూడ్కిని రుజవాసి యెఱుకగలిగె
మ్లేచ్ఛుఁడని తోసిపుచ్చక యిచ్చెఁదీర్పఁ
దద్గృహంబున మెట్టి యుద్ధరియయ్యె
నే నృసింహసరస్వతి యేలునతఁడె॥ 104
ఉ॥ పాలితభక్తలోకుఁడు కృపాపరిపూర్తి యపాకృతార్తి శ్రీ
శైలమునం దిరోహితుఁడు సద్గురుమూర్తి యెతండుగా నిలన్
గీలితపుష్పపీఠుఁడరిగెన్ సరిదంతరగామి యాప శి
ష్యాలి ప్రసాదపుష్పముల నందఁగ నాతఁడె తేర్చు మమ్ములన్
ఉ॥ ఎవ్వఁడు సహ్యశైలముననే తిరి యర్ఘ్యము 'కాశి'గైకొనున్
బువ్వకొలాపురంబు'నకుఁబోయి గ్రహించును, 'విఠలాఖ్య'మా
చివ్వకునంతలోఁజను విచిత్రముగానల "గాణగా" కదేన్
దవ్వనఁబోఁడెతండెది సదా "కురుగండి" కినట్టులేకదా॥
ఉ॥ చొక్కపుమేనివాఁడు కడు సొంపగు తామరమోమువాఁడుబల్
చక్కని తమ్మిరేకులకుఁ జాలగు కన్నులవాఁడు నిమ్ములన్

దక్కినవాఁడు నిక్కముగ దక్కొనువాఁడు కమండలంబుచేఁ
జిక్కినవాఁడు సుద్దినగుఁ జెన్న నసూయకుఁ గన్నవాఁడహో॥

చ॥ 'జయజయ దేవదత్త! త్రిదశప్రతతి ప్రథితాభిపూజితా
జయజయవర్ణ్య నిత్య! సదసద్విదభిజ్ఞ బుద్ధైక సాధితా
జయజయ సత్యభావ! నుతసంయమి లోకశరణ్య దేశికా
జయజయ భద్ర!' యందు విలసచ్ఛుభదాప్రతిమానభావుకా॥

సీ॥ స్రష్టా! విసృష్టాష్టకష్టా! వినష్టారి
చేష్టా! పరికృష్టేష్ట దృష్టిఁగొనుము
కర్తా! త్రిలోకైకభర్తా! తతత్స్వావి
హార్తా! సమస్తాఘ హర్త! నతులు
శ్రీదత్తమూర్తీ! ప్రసిద్ధాచ్ఛకీర్తీ! న
తార్థి ప్రపూర్తీ! హతార్తి! యివిగో
బృందారకాగ్రీయ! వందారు భక్తౌఘ
మందార! కైకొమ్ము వందనములు॥

తే॥ సర్వదుష్టాసురానీక గర్వహరణ
సచ్చిదానందమూర్తి! ప్రశాంతవర్తి
వారితాశ్రితజనజూర్తి! భావపూర్తి
సారెసారెకు నీకు జోహారులివ్వె॥ 109

## —♦ కవిరాజ విరాజితము ♦—

నరహరి! నీచరణంబనయంబు మ
నఃఫలకంబున నాటుకొనన్
శరణను చుండఁగ సారెకు సారెకు
సాధుగురూత్తమ! సాదుమినన్
గరుణనుజూడు మగాధభవాంధవి
కర్తనమూర్తి! యఘుంబడఁగన్
గరమనురక్తిని గామితదాత జ
గన్నుతనేత! సుఖం బిడఁగన్॥ 110

## —♦ మంగళ మహాశ్రీ ♦—

శ్రీపదులు వల్లభ నృసింహ యతులంచిలఁ బ్రసిద్ధిఁగను దత్తగురుమూర్తి!
నీపదజలేజముల నేనయి ద్విరేఫమును నిన్కుఁదు నుపాత్తసత్కీర్తి!
యాపనలఁ బాపఁదగు నాదరువ వీవయిన నందఱకమంగళ మడంగున్
జూపఁదగు ప్రేమమును జూపిన "సుధారసపు" జోషమున మఙ్గళమెసంగున్॥

### గద్యము.

ఇతి శ్రీ మేధా దక్షిణామూర్తీశ్వరాక్షీణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర నాదెళ్ల పురుషోత్తమ కవీంద్ర పుత్త్ర మేధా దక్షిణామూర్తి నామధేయ విద్వద్విధేయ కర్తృకమైన దత్త భావసుధారసము.



శ్రీ గురుపాదార్పణమస్తు.

♦ సంపూర్ణము. ♦

## —♦ సవరణలు ♦—

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 5 | చేని | చె, ని |
| 8 | 17 | దెప్పు | దెప్పు |
| 8 | 17 | వన్య | వవన్య |